శ్రీః

# ఆర్యవాణి



గ్రంథకర్త:

వైద్యవిద్వాన్, నారునాగనార్య

కోడూరు.

సదయుఁడు సుపజ్ఞుఁడుఁ గవిసత్తముండు
సరసుఁ డస్మద్గురుఁడు వేద సత్కులుండు
నైన వేంకటకృష్ణ శర్మాహ్వయునకు
నంకితమొనర్తు మత్కృతి నతులభక్తి!

శ్రీః

# కళ్యాణోదంతము.



శ్లో. "వాంఛా సజ్జనసంగమే పరగుణే ప్రీతిర్గురౌ నమ్రతా
విద్యాయాం వ్యసనం స్వయోషితి రతిర్లోకాపవాదాద్భయం,
భక్తిశ్శూలిని శక్తిరాత్మదమనే సంసర్గముక్తిః ఖలే
యేష్వేతే నివసంతి నిర్మలగుణా స్తేభ్యో నరేభ్యో నమః."

భర్తృహరి.

మహాశయులారా! సుగుణము లనేకవిధములు. వాని తెలుంగులెఱుంగుట శక్యముకానివని. సామాన్యముగాఁ బరోపకారనిరతి సద్గుణవర్యమని పేర్కొనంబడును. ఏనుఁగుపాదమున సకలజంతువులపాదము లిముడునట్లు పరోపకారమను సద్గుణమున నన్నియు నిముడఁగలవు. సకలశాస్త్రసారము పరోపకారనిరతియే యనవచ్చును. అది రెండువిధములు. భరణరక్షణములని వానిపేరులు. అన్నదానాదులఁ గాపాడుట భరణము, ఆపదలనుండి కాపాడుట రక్షణము అని పెద్ద లందురు. రక్షకుఁడనఁగా భగవంతుఁ డొక్కఁడే యని నిర్ణయము. అన్నదానాదులఁ గాపాడునట్టి భరణముకూడ రెండువిధము లనవచ్చును. విద్యనేర్పి జ్ఞానమలవడునట్లొనర్చుట. సంసారయాత్రకుఁ దోడ్పడుట, యనునవియే యవి. ఈ రెండు తెలుఁగులందుఁ బోలుతఁ బేర్కొనఁబడినది శ్రేష్ఠము అవి తన్మూలముగ నిత

రులనుంగూడఁ దోడ్పడఁ గలదు. విద్యారూపమున భరించుటుత్తమమనుట నిర్వివాదాంశము.

విద్యాదానమున నొకఁడనేకులను బోషింపఁ జాలఁడు. కవిపండితులలో నెవఁడధికుఁడను ప్రశ్నము వచ్చినపుడు కవియే యనవలయును కవి శాశ్వతుఁడు. మహోపకారకరణదక్షుఁడు. పండితుఁడు కృతిగాక తక్కిన స్థిరసంతానములవలె నున్నచోటనే ప్రకాశించువాఁడు. కవి కృతిరూపమున నెల్లయెడల నేకకాలమున నుండఁగలఁడు. కావుననే "సుకవితా యద్యస్తి రాజ్యేన కిమ్" అని భర్తృహరి తేటపఱచెను. కావునఁ గవి శాశ్వతస్థితిగలవాఁడనియు నిత్యతృప్తుఁడనియుఁ దేటపడుచున్నది.

ప్రస్తుత మీ ప్రస్తావమునకుఁ గారణమైన దొక కవిచరిత్రము. కడపమండలమున రాజంపేట యను నుపమండలమునఁ గల కోడూరునివాసముగాఁగల శ్రీయుతులు వైద్యవిద్వాన్ నాయనాగనార్యులు వైద్యవృత్తి జీవనప్రదయగుచుండ నిస్వకుటుంబమునఁ బుట్టినను నిత్యతృప్తిగలిగి భాషాసేవచేఁ గాలముంబుచ్చుచుఁ బెద్దలసంగతి నభిలషించుచునుండు సత్కవివతంసులు సలక్షణభాషయన్నఁ దలనొప్పి యనుపెద్దలు పెక్కండ్రుక్కుమిగిలి ప్రాచీనకవిత్వము నిస్సారమనియు, దానిం బఠించుట వ్యర్థకాలక్షేపమే యగుననియు నొక్కినొక్కి వక్కాణించు నిక్కాలమున సలక్షణభాషతో నార్యవాణి యను పొత్తమును వ్రాసిరి. యతిమొదలగు నియమముల వదలక పాఠకులకు సుబోధకముగా నుండునట్లు గీతపద్యముల సలక్షణభాషతో గ్రంథము నడపఁబడినది. అందుఁ దొలి పద్యము.

శ్రీమదోంకార పీఠవసించి జగము
లప్రతిహతాజ్ఞఁ బాలించి యాశ్రితాళిఁ
గరుణఁ బెంచిన తల్లి నగన్నతల్లి
లలిత పరతత్త్వకలిత నే దలఁతు భక్తి.

ని వ్రాసిరి. తొలిపద్యము కవి మనస్తత్త్వమును దెలుపు
ని పెద్దలందురు. దీనిం బట్టిచూడఁగా భక్తిరసప్రధానమగు
నోవృత్తిగలవారని తేలెడిని పరతత్త్వకలిత = అనుటంబట్టి
ద్గురువులమూలమునఁ బరదేవి వాస్తవస్థితిఁ దెలిసికొని
ద్భక్తి సంభృతస్వాంతుఁ డయ్యెనని తోఁచెడిని. కామేశ్వర
ప్రాణానాడీ = అను నామమునకు భాష్యమునందు "కామేశ్వ
స్య శివకామస్య ప్రాణనాడీ జీవనాడీవ తదుక్తమాచార్య
గవత్పాదైః.

సుధా మప్యాస్వాద్య ప్రతిభయజరామృత్యుహారిణీం
విపద్యంతే విశ్వే విధిశతమఖాద్యా దివిషదః,
కరాళం యత్క్ష్వేళం కబళితవతః కాలకలనా
న శంభో స్తన్మూలం తవ జనని తాటంకమహిమా.

అని యున్నది. ఈభావమే పైసమాసము బోధించుచున్నది.
కాలమున నిదియు విచిత్రమే యనఁదగియున్నది. ఇందు
నైతికము, మతము, సాంఘికము, రాజకీయము, జిజ్ఞాస, వివిధ
విషయములు అను విషయములు చర్చింపఁబడినవి. కవిగారి
తెలివితేట లాయావిషయముల విచారించునపుడు పాఠకులకుఁ
దెలియకపోవు. చక్కనిమార్గమున గ్రంథము సాగింపఁబడినది.
శైలి మనోహరముగా నున్నది. పుస్తకమంతయు నీతిసార
ముగా నున్నది. ఈగ్రంథరత్నమునందు,

సదయుఁడు సుపక్షుఁడుగ్ బుధ • సత్తముండు
సరసుఁ డస్మద్గురుఁడు వేద • సత్కులుండు
సైన వేంకటకృష్ణ శ • ర్మాహ్వయునకు
నంకితమొనర్తు మత్కృతి • నతులభక్తి.

అని వ్రాయఁబడినది. దీనింబట్టి పరికింపఁగాఁ బైన వ్రాయఁబడిన విషయము సత్యమే యని తేలకపోదని నావిశ్వాసము.

శివేరుష్టే గురుస్త్రాతా గురౌరుష్టే న కశ్చన.

అను న్యాయముననుసరించి గురుభక్తి యున్నఁగాని దేవతాభక్తి యుండదు. ఈకవితల్లజునకు గురుదేవతాభక్తి దృఢముగఁ గలదనుట స్పష్టము. తైలికులలోఁ గవులీప్రాంతమునఁ గానరారన్నకొఱంతను వీరు తీర్చిరని యబ్బురంపడుచున్నాను. వీరి ముద్రితగ్రంథములలో నిదియే మొదటి దనుకొనియెదను. ఇది చక్కనిపాకమున నలరారుచున్నది. ఇంక నిట్టిగ్రంథములం బెక్కింటిని వ్రాసి కడపమండలవిఖ్యాతిని బెంపొందింపఁగలరని విశ్వసించుచున్నాను. పరమేశ్వరి యీకవితల్లజులకు దీర్ఘాయురారోగ్యభాగ్యములం బ్రసాదించుగాక.

ఇట్లు విన్నవించు విద్వద్విధేయుఁడు,

జనమంచి శేషాద్రిశర్మ.

శ్రీ. శ్రీ. శ్రీ.

# ప్రశంస.

శ్రీయుతులగు నారునాగనార్యవిరచితమగు నీ చిట్టిపొత్తమును సంపూర్ణముగఁ బఠించితిని. ఇందలిపద్యంబులన్నియు గీతంబులు. ఇవియన్నియుం సరళపదభూయిష్ఠంబులై విననయంతనే, చదివినయంతనే మనంబున కానందంబుం గూర్పఁజాలి యున్నవి. ఇందు సాంఘికము, రాజకీయము, నైతికము, మున్నగువిషయంబులు మానవసమాజశిక్ష కుపయుక్తములుగఁ బ్రతిక్షణము వ్యవహరింపఁదగిన యంశంబులతో నొప్పారుచున్నయవి. ఏ పద్యమున కాపద్యమే నిరుపమానముగ నున్నది. గ్రంథకర్తగారికిఁ గల లోకానుభవము వర్ణనాతీతమనుట యతిశయోక్తి కానేరదు. తాఁ జేసిన ప్రతిజ్ఞను జక్కఁగ నిర్వహించి యీగ్రంథమును బ్రకటించిన వీరికెల్లరును కృతజ్ఞులైయుండక తప్పదు. చదువుటకును వినుటకును నెట్టివారికైన రుచి పుట్టించు నీపద్యములును, నిందలి లోకోక్తులును స్వాభావికములగు వర్తనములును, విషయవిభాగంబులును సాటిలేనివి. నిజముగ నీగ్రంథ 'మార్యవాణి' సార్థకనామధేయమని జంకులేక చెప్పఁగలను. నీతిగ్రంథములలో నెయ్యది యగ్రగణ్యమని నాతలంపు. సహృదయు లగువార లిద్దానిం బఠించి యానందింతురు గాక! వీరిట్టి లోకోపకారకకృతులం బెక్కింటిని రచింపఁగల శక్తిగలిగి చిరాయురారోగ్యభాగ్యసమేతులయి యొప్పుదురు గాతమని జగత్పితను మఱిమఱి నుతించువాఁడ. పాఠశాలలయందు బాలికాబాలకుల య్యది పఠనార్హముగాఁ గావించి యీగ్రంథకర్తగారికి గ్రంథనిర్ణాయక సభాసభ్యులు చేయూఁత నొసంగుదురు గాక!

శ్రీలలితావిలాసము
కడప.
17-8-1939.

సుధీజనవశంవదుఁడు,
జనమంచి వేంకటసుబ్రహ్మణ్యశర్మ,
తెలుఁగుపండితుఁడు,
మునిసిపల్ హైస్కూలు, కడప.

# మనవి.



'ఆర్యవాణి' నాకుఁ జిరపరిచితము. అది మృదుమధ
పదవిన్యాసాలంకృతము అపూర్వభావసంభరితము. సముచి
రసతుందిలము. సుశిక్షితశయ్యాసంశోభితము. అట్టిచోఁ ర
పిపాసువుల కెవ్వరికి వలపు గొలుపదు? ఇఁక నాయొక్క
మాట యేల?

నేఁటి దేశపరిస్థితిం గనులఁ గట్టినట్లుచూపుపట్టునన
సంస్కరణమార్గము లుపదేశించు నవసరమునను, నైతికవి
యములు దెలుపు సందర్భమునను 'నార్యవాణి' కా పేర
సార్థకము. రాజకీయ-సాంఘిక-మత దురాచారముల నిర్దాక్షి
ణ్యముగ ఖండించునెడల శతారము. కొన్నియెడల వేమ
యోగిరచనములు, మఱికొన్నిటఁ గవిబ్రహ్మపోకడలు గన
పట్టెడు. విషయగౌరవముం బరికించుచో నాబాలగోపాలము
కంఠస్థములు గాఁదగిన పద్దెములు. పండితులకు వెగటు గాదు
పామరుల విసిగింపదు. సర్వజనాదరపాత్రము. ఇట్టికవిత లాంధ్ర
వాఙ్మాతకుఁ జొక్కంపుబంగరుసొమ్ములు. నిరర్థకశబ్దసంకలిత
భావకవితానామకాభాసగ్రంథములు "గిల్టు" నగలు.

ఏవంవిధ గుణరత్నఖని— 'యార్యవాణి' నామదిం
జూఱగొనుటేమి వింత? "స్త్రీరత్నం దుష్కులాదపి"—కదా!
ఇఁక నార్యవాణీగతసకలశుభలక్షణములు నన్ను దానిం బరి

గ్రహింపఁ బ్రేరేచుట సహజము. శిష్యావతంసము, చిరంజీవి యార్యుఁడును సఫలీకృతగురుమనోరథుండయి, యుభయుల యశోలతిక కింతయూఁత ఆంధ్రప్రపంచమునఁ గల్పించె. కాని, కృతికిఁ దగుబహూకృతి సేయ, నసమర్థుఁడ నగు నన్నతఁ డర్థించునది, నేను గృతజ్ఞతాపూర్వకముగ నొసఁగఁదగినది, యొక్క వాత్సల్యపురస్సరాశీస్సే. అదియే యతనిపురోవృద్ధికి మూలకందమగు కానుకయై యెసఁగుఁగాత!

జగన్నియంత కృతికన్యకకును, దజ్జనకునకు నాతనికుటుంబమునకుఁ జిరాయురారోగ్యభాగ్యము లొసంగుటయ గాక, కృతికర్తచే నిట్టి వింకను బెక్కులు చేయించుఁగాత!

పాత్రము చిన్నదంచుఁ దల
　　పోసి త్యజింతురు గొంద; ‘ఱేల యీ
చెత్తలు చచ్చుగీతములు
　　ఛీ’ యని చూడరు గొంద; ఱెందులన్
సత్తు నసత్తుఁ దేల్చుటకు
　　సొంతముగాఁ గనుఁగొంద్రు గొంద; ఱా
సత్తములే రసగ్రహణ
　　చాతురిఁ గల్గు విమర్శకాగ్రణుల్.

విద్వద్విధేయుఁడు,

**వేదము వేంకటకృష్ణశర్మ.**

# వి న్న ప ము.



దేశీయసోదరులారా!

నాహృదయాభిప్రాయముల వెలువరింప నుద్దేశించి యీ "ఆర్యవాణి" పేర గీతపద్యముల వ్రాసితిని. ఇయ్యవి ఆంధ్ర ప్రపంచమున కెక్కుడుగ నుపయోగపడునని విజ్ఞుల యాశీర్వాదమే యైనయెడ నాపురోభివృద్ధికి నియ్యదియే మార్గదర్శకముగా గ్రహింతును. విద్యాబుద్ధులంగఱపిన విద్వాన్ వేదము వేంకటకృష్ణశర్మగారికి యీమూలమున ఋణవిముక్తి పడయందలంచితిని. మఱియును కావ్యస్మృతితీర్థ కళాప్రపూర్ణ శ్రీజనమంచి శేషాద్రిశర్మగారును, కావ్యస్మృతితీర్థ విద్వాన్ జనమంచి వేంకటసుబ్రహ్మణ్యశర్మగారును నాకొనర్చిన విద్యాసాహాయ్యమునకు వారికి సర్వదా కృతాంజలిబద్ధుండ నగుటయేగాక యెన్నటికి నాయుపకారము మఱువఁజాలనని మనవి.

ఇట్లు,

భాషాసేవకుఁడు,

నారునాగనార్య.

మకాం కడప

ప్రమాధి నిజశ్రావణ శుద్ధ ౧౫ శనివారము.

నమః శ్రీ మాతృదేవ్యై.

# ఆర్యావాణి

## ప్రార్థనాదికము.



శ్రీమదోంకార పీఠివసించి జగము
లప్రతిహతాజ్ఞఁ బాలించి యాశ్రితాళిఁ
గరుణఁ బెంచినతల్లి; నన్నుగన్నతల్లి
లలిత! పరతత్త్వకలిత! నేఁ దలఁతు భక్తి!

2

నీవ నేనయి నారూపు నీవ వెలసి
తఱచిచూడ నభిన్నత్వదశ వెలుంగు
నేమహాదివ్యతేజ మాత్మీయగమ్య
పథనిదేశంబు నద్దానిఁ బ్రస్తుతింతు.

3

ఉపమలున్న వా! యేమొ నా కూహ లేదు
కాని భాస్కరకోటి సమాన దివ్య
తేజమున వెల్గు నిన్ను నుతింపఁ దరమె
మందమతి నైన నాకు శ్రీమాతృదేవి.

4

నిక్కమగు ప్రేమ మెదనె జనించుఁ గాని
స్థిరముగాదది చపలతఁ । బరఁగు కతన
నిలుకడం గలభక్తి నీ । దలఁతునేని
మైమఱతు నెట్లు నుతియింతు । మాతృదేవి.

5

భుక్తికై వేఁడుకొనలేదు । ముక్తికొఱకు
వాంఛ యిసుమంత లేదు నీ । పదసరోజ
మధువునకుఁ దపియించెడి । మధుకరమను
నన్నుఁ ద్వద్భక్తిఁ గృపఁ జూడు । కన్నతల్లి !

6

మాయ కనుఁగప్ప నీయున్న । మఱుఁగు తెఱఁగుఁ
దెలిసికొనలేక తడఁబడి । తిరుగువేళ
భూతమటు వెంటనంటి య । భూతపూర్వ
కరుణఁ గాపాడుదువె ! నన్నుఁ । గన్నతల్లి !

7

త్వన్మహామహిమలఁ జాటు । బహుళసృష్టిఁ
గాంచి తనివోక మిగుల న । క్కజమునందు
స్వాంతమును గనె పరవశ । త్వంబు నిన్నుఁ
బొగడఁ బూనఁగ వాక్కును । నెగడదమ్మ!

8

ప్రకృతి యెల్ల వేల్పులకు, సర్వ
మన్నిటం జెలఁగుశక్తి
హేతువు ప్రకృతిరాజ్ఞి
మాతృదేవి నీ కెన గలుగునె ?

9

నేయి వలెఁ గానఁబడక యుండ
తలు మాచెంత నే వసించి
గురుమూఁత లాడించునట్టి
వర్ణింప నేరఁ దల్లి!

10

హిమలు దెలియఁ గల్పములె సాల
ప్రకృతికతీతవౌ నినుఁ గనంగ
వము పట్టునో ! యెవ్వఁ డెఱుఁగు
జడుండఁ దెలియంగఁ బల్కవమ్మ!

11

నమ్మి నుతియింతు నంతె కాని
నుఁగొను మార్గమ్ము నెఱుఁగ గలనె ?
అల కె నీపదస్పర్శనంబు
గ్యము గలుగునె? జనని, చెపుమ !

12

పాంచభౌతిక మైనట్టి ప్రకృతిశోధ
నమున మాభావలతలై హింకములవలెకె
కొనలు సాగెను; దాని మించినఁ గదమ్మ
దివ్యమగు త్వత్ప్రభావంబుఁ దెలియఁగలదు!

13

తా నెవండేల పుట్టె జగానఁ జేయఁ
దగినకృత్యము లేవి? బంధనవిముక్తి
మార్గ మెయ్యది? యేది? గమ్యస్థలంబు
సుంత యోజించు నరుఁడె, ని జూడఁదివురు!

14

ప్రకృతి శోధించి నీసృష్టిపాటవంబుఁ
గాంచి పరవశుఁడయి పులకరించుఁ గాన
నీదుభక్తుఁడె! నీకృపా నీరరాశి
మునిఁగి నిరతిశయానందమున వెలుంగు.

# నైతికము.

బింకమున మీసములు మెలి | పెట్టి బయటఁ
బులులవిధమున గర్జించు | పురుషు లింట
నాండ్రకడఁ బిల్లులంబలె | నడఁగియుంద్రు
కాముకతకంటె నైచ్యంబుఁ | గలదె తల్లి!

2

సుఖముగా నుండువారలఁ | జుట్టములును
జూడనొల్లరు చెడిపోవఁ | జూచుచుందు
రంతియేఁగాని చేపట్ట | రాదరించి
వీరికంటెను బగతు రె | వ్వారు గలరు?

3

మరణశయ్యను డప్పిమై | బొరలువేళ
నొక్కదాయాదుఁ డగపడ | నోపఁడయ్యె!
అసువు లేగినవెంటనే | యాస్తికొఱకు
"కుక్కలంబలె కాట్లాడఁ | గోరుచుంద్రు."

4

పతికి మనసునవర్తించు | సతియె యున్న
నంతకంటెను స్వస్సుఖ | మధిక మగునె?
పెండ్లియనఁ దద్దినంబను | వెలఁదియున్న
నంత కధికంబె? నారక | యాతన లన.

5

పెద్దలెల్లరుఁ బల్లెల ఽ వీడి నగర
రాజములఁ జేరి; రిఁకవారు ఽ బ్రదుకఁ గలరె ?
పరుల వంచించి సంపదఁ ఽ బడయుకున్నఁ
గొలఁది రైతులకును మట్టి ఽ గొట్టుకున్న.

6

కొసరి శిష్యులకడ డబ్బు ఽ గుంజుచొరవఁ
దప్ప నైతికపథముల ఽ విప్పి చెప్పి
స్వకులజనమును బైకిఁ దోఽవలయుననెడి
చొరవ లేనట్టి గురులు పెక్కురుఁ గలారు.

7

తెగినగాలిపటాల రీఽతిని మెలంగు
స్త్రీలుపాధ్యాయినీత్వము ఽ చెంది నేర్పు
విద్యకంటె సదాచారఽవిధులుఁ గలిగి
యింట నేర్చినవిద్య యెంఽతేని లగ్గు.

8

పురుషులో ! దాసు లతికామఽమునకు నెపుడు
ప్రమదలో ! బానిసలు నాగఽరకవిధులకుఁ
గాన నన్యోన్యప్రేమంబు ఽ గంగఁ గలిపి
యొండొరుల వంచనము సేయ ఽ నుద్యమింత్రు.

9

శాశ్వతానందసిద్ధి వాం।ఛఁ గలదేని
త్యాగభోగంబులను జీవ।తలిని నాత్మఁ
దృప్తి నొందించు చొకక్షణ।మేని బ్రదుకు
మదియె! జీవితఫలమని । యార్యులంద్రు.

10

తీపిఁ గలలడ్డు మితిలేక । తినిన రోగ
మంకురించెడిరీతి చేదైన మందుఁ
బూని సేవింప నారోగ్య।మును ఘటించుఁ
బ్రకృతిగతలక్షణము లెంత । వికృతులౌర!

11

పైపటాటోప వేషాల । భ్రాంతిఁ గొలిపి
జనులఁ గికురించు కాలమ్ము । జరిగిపోయె
నిగమసత్యపిపాసు లీ।యుగమునంద
వెలువడిరిగాన వంచకుల్ । నిలువఁగలరె!

12

డాబుసరిజీవితంపు బ।డాయితనము
తమదు పైపసలో లొటా।రమును జాటఁ
దిరుగు నీనాఁటివైద్యులు । తెవులుగొంట్ల
పాలిమిత్తులు క్రియ నాస్తి । వారియందు.

13

కాలవిపరీతమో యేమొ । కాని సొగసు
లాఁడి నడిత్రోవలోఁ బోవ । లక్ష్యముంచి
మనసు కక్కుర్తిఁ జెందు; నా।మానవజడు
భార్య నారీతిఁ జూడ నె।ప్పగిదిఁ గుందు.

14

కంటికద్దము లోకచేఁత।కఱ్ఱ సూటుఁ
బూని చనుదుర్గుణాభ్యాసి । నైన జనులు
గొఱ్ఱెలంబలె వెన్నాడి । కొల్తు రకట!
వేసమున మోసపోదురే । విజ్ఞవరులు.

15

సుఖము లోడఁగూడ మిఱ్ఱెక్కి । చూడనోపఁ
డాపదలఁ గుందు వేళ ద।య్యంబు తోఁచు
మనుజుఁ డుత్తమకక్ష్యఁ గై।కొనఁ దలంచె
నేని కష్టమహోదధు । లీఁదవలయు.

16

పగతు లొనరించుఁ గృత్రిమో।పాయములకు
ద్వేషము వహించి కీడుఁ గా।వించుకంటె
స్వగుణదోషవిమర్శన । సలిపి చెడుగు
గాంచి పోకార్పఁ గిన్కవ।హించుటుఱవు.

17

ఓషధులు సత్వములు లేక ॥ యుండుకతన
మానవులు కామ్యకర్మల ॥ మరగుకతన
చిత్రతరరోగములగుముల్ ॥ సెలఁగుకతన
వైద్యులకుఁ జేఁతినిండుగఁ ॥ బనులు గలిగె.

18

పలువిధంబుల రోగముల్ ॥ ప్రబలుకతన
తత్త్వ మెఱుఁగనివైద్యుల ॥ ఘాటికతన
మానసికదుర్బలత హెచ్చి ॥ మ్రగ్గుకతన
వీరభారతమెల్ల నిర్వీర్యమయ్యె.

19

కులట చేరి చెఱచుఁ ॥ గులవధూరత్నాల;
బంగిముచ్చు చెఱచు ॥ బంధుతతుల;
దుష్టమంత్రి చెఱచు ॥ శిష్టులౌ ప్రభువులఁ;
బరమపాపి చెఱచు ॥ వంశమెల్ల.

20

అఖిలకార్యకలాపములందు ముందు
లాభసంపాదనము పెద్దలకె తలంప;
దానికై సాహసించు పేదలకు నెపుడు
తాఁకినట్టి మూఁతిగాలుట ॥ తప్పనిసరి.

21

చిలుముగలవారు ప్రజలకుఁ ౹ జేయుకీడు
లనుగతంపుఁ బ్రమాదములట్లు దోఁచు;
అనదలజ్ఞతఁ జేయుకార్యములో? యోర్వ
రాని యపరాధములు గాఁగఁ ౹ గానిపించు.

22

వేఁకువనె బొంకినఁగాని ౹ వీడిరావో?
కొట్టు తాళము కల్లల ౹ గుట్టలగుచు;
నన్నృతభోజ్యము వాణిజ్య ౹ మాశ్రయించి
కోటిఁ గూర్చిన నేమి? ప్రాజ్ఞులకుఁ దగునె?

23

బొంకులకుఁ దావు, వంచనములకుఁ బేరు,
అనయములకిల్లు, ద్రోహాల ౹ కాటపట్టు,
నఘములకుఁ బాదు, దుర్నీతి ౹ కాస్పదంబు,
వలదు ఋజుమార్గవర్తికి ౹ వర్తకంబు.

24

కులట యెఱుఁగఁ గలదె? ౹ కులసతిమర్యాద;
పిశునుఁ డెఱుఁగఁ గలఁడె ౹ పేదబాధ;
చపట యెఱుఁగఁ గలఁడె ౹ శాస్త్రజ్ఞవిజ్ఞత;
నల్పుఁ డెఱుఁగఁ గలఁడె ౹ యధికుశక్తి.

25

తర్కమునఁ గర్కశతఁ జూపి § తమ్ముమించు
పరమభక్తులు లేరని § బిరుదుఁ గాంత్రు
నోరుఁగలవారు; సాధుల § కూరుఁబేరు
లేదు, వాచాచమత్కృతి § లేనికతన.

26

సహజసద్గుణసముపేత § జనుని నిత్య
వర్తనంబుల మార్పాటు § వఱల దెపుడు;
జగము నాహ్లాదమున ముంచు § చలువతేని
శీతలత్వంబు మార్పాటుఁ § జెందఁ గలదె?

27

అమృతసంసర్గమున విస § మమృతమగును;
పాలఁ గలిసిన నీరును § పాలె యగును;
భ్రమరమును జేరఁ గీటంబు § భ్రమరమగును;
సజ్జనుని గూడి ఖలుఁడును § సజ్జనుఁడగు.

28

దేశద్రిమ్మరియయి ప్రవర్తించి, మిగుల
సుగము మరిగిన సోమరేపగిది మేను
వంచి పనిపాటులను నొనరించఁ గలుగు;
నరయ నాబోఁతు సేద్యాన § కర్హమగునె?

29

పాడుపడి పూజలేనట్టి ప్రాఁతగుడుల
వంకఁ జూడరు; క్రొత్తదేవళము లెన్నొ
కట్టనెంత్రు జనుల్ వివేకంబుఁ దొఱఁగి;
క్రొత్త యొక వింత ప్రాఁతయు రోఁతగాదె.

30

ఎవ్వఁడేనొక్కఁ డొక త్రోవ నేగ నదియ
యందఱకు "రాచబాట" యీ చందమరయ
"గొఱ్ఱెదాఁటు"నిపించు నీబుద్ధిలేని
వారు జగతిని బరిహాసపాత్రులె కద!

31

పడియకుఱ్ఱ నాల్గుదిక్కులఁ బడిన నీర
మందె చేరెడుపగిదిఁ బ్రజాళిధనము
పరమధని బొక్కసమునక వచ్చిచేరు;
మఱల దది పడియ జలమును మఱలనట్లు.

32

మిటుకులాఁడుల బడిఁ జెప్పుమిషను తమదు
జనపదంబులఁ జేరిచి స్థానికాధి
కారు లొకకొందఱాత్మీయ కామతృప్తిఁ
దీర్చుకొనఁ జూతు రవినీతి తెరువుపట్టి.

33

రొక్కమును గోకలును సొమ్ము । లొక్కమొగిని
దెచ్చి యిచ్చినఁ బ్రేమంబు । వచ్చి దూఁకు
నడ్డుమాటాడి లేదన్న । యంతమాత్ర
ప్రణయరసమింకు రమణుల । మనములందు.

34

జీవయాత్రకు జీవి భు । జింపవలయుఁ
గాని భుక్తికె జీవింపఁ । బూనరాదు
నేఁటి నాగరకాహార । నియతు లకట !
కొంతకాలంబునకె జాతిఁ । గూలఁద్రోయు.

35

మైత్రి కల్గినయప్పటి । మంచిపనులె
పగయ గల్గినఁ దప్పులై । పరిణమించు
నట్టియెడఁ గూడ ధీరుఁ డా । త్మాపరాధ
తతి విమర్శించుకొని సత్ప । థమున నడుచు.

36

శక్తికిందగు కార్యంబె । సలుపవలయుఁ,
దలకుమించినపనికి య । త్నంబుచేయఁ
బాటుమిగులును గార్యంబు । భంగమొందు
స్థలము మించంగఁ గాలును । జాఁపరాదు.

37

అలఁతు లాత్మావసరములు । గలుగువఱకె
చెలిమిసలుపుదు రాపైనిఁ । బలుకరింత;
ఘను లవిచ్ఛిన్నతైలధార నుపమించు
చెలిమి యొనరింతు రెడరులఁ । దొలఁగిచనరు.

38

పలుకుబడిఁగల పెద్దల । పంచఁ జేరి
దీనులర్థింప వినరేమి । తెగులా? వారు
బధిరులో? జడమతులా? దుర్వారగర్వ
ధూర్వహులా! వారికెదిమందు । తోఁచదెం?

39

సతులసుతులను బాంధవజనము నెల్ల
దేశదేశాలఁ దిరిగి సాధింపవచ్చుఁ
గాని కనఁగలమే యేకగర్భజనితు
లైన భ్రాతల నేదేశమందు నేని.

40

వనములూడ్చు పరశుజీవి, । పసులఁ జంపు
ఖడ్గజీవియు, బహుళ భోగములఁ గాంచఁ
బండితాగ్రేసరులు బరపిండనిరతు
లగుచు నడలుట, నీకు సహ్యంబె? తల్లి!

41

భక్తి యుండిన లేకున్నఁ బైకి నమ్రు
లయి చరింత్రు ధనాఢ్యులయందుఁ బ్రజలు
మిండ దొంగలచేఁ జిక్కి మిడుకువాఁడు
బిక్కమొగమున దండము బెట్టునట్లు.

42

వదరుపోతులు కార్యాలపట్ల వ్యర్థ
లంచు నెఱిఁగియు వారివాక్యముల తీపి
కెంతయును ముగ్ధులయి విశ్వసింతురౌర!
మొఱఁగ నేర్చినకుక్క తాఁ గఱవఁ గలదె?

43

సాలు విసమగు శూరుఁడౌఁ బంద హితుఁడె
యహితుఁడగును గృతజ్ఞుఁడు నగుఁ గృతఘ్నుఁ
డొప్పుఁ దప్పగు దుష్కాల మొదవెనేని
కాలగతిఁ ద్రిప్ప నెవ్వాఁడు కర్త! తల్లి!

44

దొడ్డవారెల్ల ధర్మవిద్రోహమతులు
సన్నవారెల్ల నర్థచంద్రప్రయోగ
పాత్రులు కులక్రమాగతపద్ధతులను
గలుగువార లనాగరకులు ధరిత్రి!

45

చెలిమిఁగలయప్డు మిత్రుని ॥ చిత్రపట
సమ్ముదంబిచ్చు; నాతండె ॥ శత్రుఁడైన
జెత్తకంటెను బీడు తాఁచ్చిత్రవారా!
నరుమనోవృత్తి యెంతయబ్బురమొ?

46

కోఁఱమీసలు మిడిగ్రుడ్లు ॥ గుంతనో
దనరు నయ్యాలచేతి కద్దంబువలయు;
దేహసౌందర్యమే ప్రసిద్ధి యనఁదగు
సద్గుణశ్రీ దనరకున్న ॥ జనునకెందు!

47

తమ్మిపూదేనెతీఁపి చెంతనె మెలంగు
కప్ప తెలియునె? యెచటనో ॥ క్రాలు
తెలియుఁగాక మహాత్ములదివ్యమహిః
దూరగతులట్లు ప్రాంతస్థు ॥ లారయుః

48

గడుసుఁదన మేలుబడియు రొక్కం
యందఱ గులాములను జేయు ॥ నా
వ్యక్తి గతమగునమ్రత ॥ వట్టి దనుచ
దెలియునాతండె మతిమంతుఁ ॥ డిలన

49

సాధు లోకలక్షమందిర్యే ౯ సత్త్రమంద
కలిసిమెలసి వసింత్రు; భూ౯కాంతు లిర్వ
రీ విశాలావనిఁ నివసింపఁ జాల
రార! పేరాస దీనికిఁ ౯ గారణంబు.

50

పొట్టఁ బొడిచిన ముక్క ౯ లేనట్టివాఁడు
చచ్చుగీతాలు నాల్గిడ్చి ౯ సంతరించుఁ
బండితుల మెప్పుఁ బత్రికా౯వళి ప్రశంసఁ
బయిగఁ బెద పెద్దబిరుదు లో౯పాట్లవేల ?

51

కనినమాత్రన భావల౯తను నిగిచ్చి
ననలువెట్టించి మోహవా౯సనలఁ బెంచి
తగులుపుట్టించి తమకమ్మ ౯ నెగులుఁగూర్చ
రార! నేఁటినవీన శృం౯గారవతులు.

52

అంకుతనము సేయ ౯ రాదంచుఁ దమగ్రంథ
ములను నీతిసూత్ర౯ములను గిలికి
సానులింటఁబంచఁ ౯ జవటలవలెఁ బండు
కవులనీతు లెట్లు ౯ గడలఁ ద్రొక్క.

53

నా యెఱింగినవఱకు నజ్ఞానమునకుఁ
గారణము కామమే గాన । సూరివరులు
దాని కెడమీరు తమహృదం।తరములందు;
అట్టివారె కదా! సుఖం । బధిగమింత్రు.

54

నాఁడునాఁటికి బలసిన । నాగరకము
నేర్పె దిసమొలతత్త్వము । నేఁటిప్రజకు
మఱియుఁ గొన్నాళ్ళ కాదిమ।మానవులటు
లెసఁగ సృష్ట్యాదికాలమే । పొసఁగునేమొ?

55

పేరు పెంపును గన్నట్టి । పెద్దవారు
తప్పులొనరించి యవ్వాని । నొప్పులట్ల
పలుకుబడి నేని ధనమేని । వ్యయ మొనర్చి
సవరణము సేయుదురు చట్ట।సమ్మతముగ.

56

మనసుకంటెను ద్రుతగతిఁ । జనును దుర్వ్య
యమ్ము; సద్వ్యయమనిలమ్ము । సరణి వ్యాప్తిఁ
జెందుఁ; గాన వివేకి యో।జించి దీని
మనసు నిరించి విహరించు । మారుతమున.

57

శ్రీయుతుండైన గుణియైన శిష్టుండైన
గురులచేఁ గ్రమశిక్షఁ గైకొనఁడయేని
సద్యశోవృద్ధులను బొందఁజాలునొక్కొ;
పండునే? మేకుడింపక పనసపండు.

58

తెలియఁదగిన విబుధులచేఁ దెలియుటొకటి;
తెలిసినవి యాచరించి వృద్ధిఁ గనుటొకటి;
తెలిసికొన్నవి ప్రజకు బోధించుటొకటి;
యవి ప్రజాహితకృతులంచు నెన్నఁదగును.

59

గ్రంథ మంకితముం గొనఁ గలనుదోఁచి
దేవుఁడే మ్రోల నిలఁబడి దేవులాడఁ
గవికి వాంఛింపఁ దగినది కలదె! యొండు;
నెందుకిఁక యైహికేచ్ఛాబ్ధి నీఁదులాడ!

60

ఉన్నతాశయపరిపూర్ణుఁ డొక్కవేళఁ
జిక్కులన్ స్రుక్కినన్ దొల్లిచేవ చెడఁడు;
అగ్ని తలక్రిందు లైనంత నతనిజ్వాల
లెట్లధోముఖములగుఁ బైకెసఁగకుండ!

61

ఎందఉన్నను గోరిన ఽ వెన్నియున్నఁ
దల్లి లేకున్న లేనట్లె ఽ దక్కినవియు
నోర్వరానిది మాతృవిఽయోగచింత
బాల్యమున నెక్కుడుగ నెట్టిఽవానికేని.

62

ధనమదాంధు లోకండొకఽళ్ళను దురాశఁ
జంపి యుద్యోగితతికి లంఽచంబులిచ్చి
నెలమి సతితోడ సుతులతోఁ ఽ గులుకుచుండ
ననద నిరుపేద యురిశిక్ష ఽ యనుభవించు.

63

హిమనగోన్నతభావము ఽ లమరధునికి
సాటియగు పావనత సుమఽసదృశమనము
శారదా కౌముదీకీర్తి ఽ భారతీయ
పుణ్యసతులకుఁ బెట్టని ఽ భూషణములు.

64

ఆటవెలఁదుల హావభాఽవాదికములఁ
గాంచి మెయి సొమ్మసిల భక్తిఽకలన నట్టు
లాయెనని యన్యు లెంచున ఽ ట్లభినయించు
పెద్దలకుఁ గలభక్తి డాంఽబికము గాదె!

65

వ్యాధిఁ దవిలినతరువాఁత నౌషధములు
దెఱపి లేకుండ దిగమ్రింగి త్రేఁచుకంటె
వ్యాధి వారించుటకుఁ దగునట్టి విధుల
నెఱిఁగి జాగ్రత్తఁగొంట యెంతేని లగ్గు!

66

పెద్ద వేదాంతులమని పేర్వెట్టుకొనియు
బ్రహ్మమునుగను జతనంబు వదలి తమదు
జ్ఞాన మితరులకన్నట్లు జడులఁ గఱపఁ
ద్రిమ్మరుదు రూళ్ళఁ బడి యుదరమ్ముకొఱకు.

67

కుత్తుకలుగోయు ద్రోహులు కొఱఁతలేని
నిత్యసంపదలను గల్గి నెగడుచుందు
రన్యహితకృతికారకు లంతులేని
తీవ్రదారిద్ర్యపీడలఁ దేలుచుంద్రు.

68

త్రాగుఁబోతుతనంబునఁ దానె తెచ్చి
కొనిన బీదఱికమునకుఁ దనకుటుంబ
మెల్ల ప్రతిబింబమై కూలు నెఱుఁగఁ డకట!
పాననిరతుఁ డతనికంటెఁ బశువు మేలు.

69

ప్రకృతిధర్మాలఁ దప్పక ǂ పశువులెల్ల
నడుచుకొనుచుండ మతిఁగల్గు ǂ నర
దప్పి నడయాడ నేమనఁదగును నే
పసులకడ నీతిగ్రహియింపవలయు

# మతము.



శాంతిచేఁ గిన్కఁ జెల్మిచే శాత్రవంబుఁ
బ్రేమచే హింస సమతను విషమబుద్ధి
సత్యమున నసత్యంబు జగతియందు
గెలువవలెనంటయే మహాత్ములమతంబు.

2

కామినీ కాంచనంబులఁ గడకునెట్టి
మునుపు మతగురువులు లోకమునఁ జరింప
నేఁటి మతపీఠకర్తలు బోటి లేక
నిదురవోలేరు ధనతృష్ణ నిలుపలేరు.

3

తపమొనర్చుట బ్రహ్మపదమ్ముఁ గనుట
జగదవనకృతి సలుపుట సత్యదీక్షఁ
గలిగి విధ్యుక్తధర్మముల్ నిలుపు ద్విజుల
చరణరేణువుఁ దాల్తు నా శిరమునందు.

4

ప్రేమసంపూర్ణతకుఁ బరిణామమైన
త్యాగసంసిద్ధి దానిచే నగుముదంబుఁ
గనినధన్యుని కిఁక వేఱ కనఁదగినది
లేదు లోకత్రయమ్మున లేదు! లేదు!

5

సకలశాస్త్రాచరణము లాశాప్రపూర్ణ
హృదయులకుఁగాక నిష్కామపదము వెలుఁగు
నమ్మహాత్ములకేల? మందాతురులకు
గాక! యారోగ్యవంతులకా? తలంప!

6

ఈషణత్రయము నొకింత యీఁగలేరు
ఏననెడిమమత రవంత మానలేరు
సత్యమార్గానఁ గాసంత చనఁగలేరు
పెద్దలని యిట్టిరను గౌరవింపవలెనె?

7

దైవమును నమ్మి సత్యతత్త్వము గ్రహించి
జీవితాబ్ధి స్వయంకృషి నావచేత,
దాఁటఁబూనినవాఁడు కృతార్థుఁ డగును;
గాని పరులను నమ్మినఁ గాఁడు కాఁడు.

8

సకలశాస్త్రజ్ఞుఁడే సభోజాతుఁడేని
శీలయుతుఁడేని యోగియేని క్షితిపుఁడేని
మనుజుఁ డెవఁడేని స్వకృతకర్మఫలమిందు
నందుఁ గుడువక తప్పుకోనగునె సుంత!

9

దైవకృపకింత వర్ణభేదమ్ము లేదు;
తపనునెండకు జాతిభేదమ్ము లేదు;
తెమ్మెరకు స్పర్శగులవిభేదమ్ము లేదు;
సమతయనునది సృష్టినైజమ్ము సుమ్ము!

10

సత్యధర్మదయాదిక సద్గుణములు
లేనియాతండె యస్పృశ్యుఁడౌ నిజంబు;
అవియ గల్గిన నస్పృశ్యుఁ డైనఁగాని
గౌరవార్హుఁ డటందురు సూరివరులు!

11

మనపురాణములందలి మానులకును
వారి గుణకర్మశక్తుల వలనఁ గాక
వంశములఁ బట్టియా? గౌరవంబు గలిగె;
వంశమా గొప్ప? గుణకర్మవర్జితులకు.

12

ఎరువు, పిండి, చెత్త మురికి నీరును గాలిఁ
గొంచు కుజములీవె మంచిపండ్లు
దుర్విధానములను దొలఁచియట్టులె చూపు
సత్యధర్మములను సన్మతంబు.

13

అరయఁగఁ బ్రలాప సన్నిపాతార్తుఁబోలె?
నిచ్చవచ్చినయట్లు వచింపఁజాలు
మనపురాణము లెట్లు సత్యనికషమున
వన్నెకున్ నిల్పి శాశ్వతత్వంబుఁ గాంచు.

14

కర్మపరుఁడౌట నరునకు ధర్మమంచు
గీతలాడినసుడిఁ దిలకింపలేక
యింగితము వీడి పరులకు లొంగి స్వేచ్ఛఁ
జంపికొని భారతీయులు జడతఁ గనిరి.

15

కర్మపరుఁడౌట నరునకు ధర్మమనుట
భారతీయులు భావించి బహుళదీక్షఁ
దాల్చి వెనుకడుగిడక యుత్సాహశక్తి
నడుములు బిగించి పనిసేయ నుడుగుఁ జెడుగు.

16

ధార్మికాత్ముని విమలచైతన్యశక్తి
విశ్వమున నుపకృతులు గావించుకొఱకె;
ప్రకృతిచే దత్తమయ్యె నాపని ఘటింపఁ
బడనిచో సృష్టి దుర్వ్యథాభరముఁ దాల్చు.

17

విషమమతులకుఁ గలమత । భేదబుద్ధి
విశ్వమతసమ్మతుల కెట్లు । వెలయఁ గలదు;
వేరుపడి, యుప్పుపులుసును । గారముఁ జవి
గూర్చునే యొక్కటిగఁ జేరి । కూర్చుఁగాక !

18

సంసరణవార్ధి దాఁటుట । సాధ్యమనుచు
వెఱ్ఱివేదాంతులను చుంట । వినెదు పిఱికి
వారు సులభంబుగాఁ గా । విబట్టఁ గట్టి !
సృష్టికర్తతలంపు లీ । డేఱుటెట్లో ?

19

ఆత్మశిష్యోద్ధరణమార్గ । మగయలేమి
బాదపూజలు గాన్కలు । వార్షికములు
గైకొనుటతోడనే దృప్తి । గాంచు గురుల
వలనఁ గులములకెట్టి లా । భంబుఁ గలదె ?

20

ముష్టివాఁడైన వేదాంత । ములను దెలుపుఁ
బాటలను బాడి జీవించు । భరతదేశ
మందు నాధ్యాత్మికాకాంక్ష । యడఁగి నేఁడు
వృద్ధినింగాంచె నైహిక । బుద్ధి మిపుల.

21

పడుచుఁబిల్లలకోసమో కడుపుకూటి
కోసమో క్రీస్తుమతమును గొనఁ దలంత్రు
కాని యేమతమునలేని ఘనపదార్థ
మచ్చటనె పుట్టెనని యెవ్వఁ డాసఁగొనును.

22

క్షేత్రవాసులు భక్తులఁ జెంత నెన్నొ
పేరులంబెట్టి సుంకముల్ వెఱికి, లోని
కంపుదురలంకృతాశ్మము లరయుకొఱకు.
వెలపడంతులె? దేవతా విగ్రహములు.

23

ధనము పేర్విన్నఁ బేరాస దాట్లు వేయు
మిండతల గాలిసోఁకిన మేన్గగుర్పు
లోకహితబోధనములన్న మూకభావ
మమరు నీనాఁటిమతగురుసమితి కకట!

24

అబ్జమిత్రోదయాస్తమయంబు లెపుడు
నాయువు హరించి చనుచుండు టరయ లేరొ?
తలఁచికొన్నంత నేల సత్కార్యవితతి
సలుపకయె జాగు చేయుదు రిలను బ్రజలు.

25

విశ్వమానవకల్యాణ విభవమునకుఁ
బొంగి పొరలు ప్రజాహృదం భోజమధువు
విమతతాపోపశాంతిఁ గల్పించువేళ
భిన్నకులకక్ష లెంచుట వెఱ్ఱితనము

26

బొడ్డువాఁకిన గడ్డాల పొడవుగాక
శమన కింకరులట్లు దండములతోడ
బలిసి తిరుగాడు తాఁటదమ్మలచరిత్రఁ
దడవఁ బనియేమి? మాయాత్రిదండులగుట.

27

జగమునఁ గల్గు మతముల సారమిద్ది
యంచెఱుంగక ప్రతిమతమందు వ్రేలు
పెట్టి చవిఁజూడఁ దలఁచిన నిట్టిభవము
లెన్నికావలె? తత్త్వమింకెపుడు గనుట?

28

ఎంత భౌతికవాదమే నెదురునిలిచి
పోర నాధ్యాత్మికరహస్యబోధ యెఱుఁగుఁ
దెలిపి యెఱుఁగని తత్త్వోపదేశకలన
నయపథంబున జనులను నడుపునతఁడ.

29

సంశయవ్యాధిపీడితుఁ జక్కఁ సేయు
నౌషధముగన్న సద్వైద్యుఁ డగపడండు
కాని కాలమె యావ్యాధి కడపుమందు
దానిఁ గనుఁగొన్న వెజ్జన దైవ మొకఁడె!

30

చిత్తమునఁ గోరినవియెల్లఁ జిక్కకునికి
జీవసాధననిర్మితి చెలఁగకునికిఁ
బలుశ్రమము లోర్చుశక్తిని బడయకునికి
నడలి లోకమ్ము దైవమ్ము నాశ్రయించె.

31

సృష్టిలోఁ దొల్త మానవుల్ క్రిములవోలెఁ
గనఁబడినవేళ మతభేద మనఁ దెలియదు
నాఁడునాఁటికి బలిసిన నాగరకము
ఋతము గడఁద్రోచి మతభేద మతకరించె!

32

కామసంతృప్తికొఱకయి గణికలకొల
మేర్పఱచి వారియాటల నెలమిఁ గనుచు
నిండ్ల నిల్లాండ్ర మఱచుట హిందువులకు
సిగ్గు చేటార్యసీమకుఁ జెడనిమచ్చ.

33

లోకవృత్తముఁ గనుఁగొను § లోభముడుగుఁ
ద్యాగమునుగాంచు భక్తివి§ధాన మెఱుఁగుఁ
గష్టసుఖముల ననుభవ§కలనఁ దెలియు
మనుజుఁ డిఁకఁ దీర్థయాత్రలఁ § గననిదేమి ?

34

మతమటంచుఁ గులక్రమా§గతమటంచు
విగ్రహంబులకడ జంతు§నిగ్రహంబు
బలులపేర నొనర్తురు § పామరజను;
లదియ శాస్త్రోక్తమని యందు § రార్యవరులు !

35

జంతుబలిఁగోరు మతమొక § సాధుమతమె !
భిన్నకులతత్త్వ మతమొక § ప్రేమమతమె !
అవినయమురేఁచు మతమొక § యార్యమతమె !
మతము గాదది పాషండ § మతము గాని.

36

మామతమె గొప్ప దన్నిధ§ర్మములకుదురు
ఇతరమతధర్మముల లోఁటు § లెన్నొ కలవు;
అనుచు వచియించువారు, జ§డాత్ములె కద !
కలుగు లోకెందు సమబుద్ధి § కొలఁదిదైన ?

# సాంఘికము.



పురుషునకు మూఁడుకాళుల । ముసలికైన
విధురునకుఁ బెండ్లి తగుఁగాని । వెలఁదికెపుడు
వయసుదానికి విధవకుఁ । బరిణయంబు
తగదనెడు శాస్త్రపక్షపా।తంబుఁ గనుఁడి.

2

ద్రవ్యపతియింట మరణమే । తారసిలినఁ
బిలువకయె పోదు రెల్లరు; । పేదయింట
పెండ్లియేయయ్యెఁ జుట్టాలు । వేఁడఁబడియు
నరుగ రన్నిటికిఁ మూల।మర్థమె కద!

3

దైవకైంకర్యమున దేవ।దాసియయ్యెఁ
బూర్వ మీనాఁడు కామాగ్నిఁ । బొరలునరుల
దాసియైయుంట జాతికం।తకును సిగ్గు
పడుపువృత్తికి నొకతెగ । విడువఁ దగునె?

4

ద్రవ్యవంతులు కూటిపే।దలను రొక్క-
మిచ్చి కొని రనుపేరు లే।దేమొ గాని
పశుల నదలించి బెదరించి । పనులుఁగొన్న
యట్టిసేతలుఁ గన దను । వవశమగును.

5

కోటిబొంకులాడు కోమటిచే సీవి
సంతరించి సంతసమున మనును
గాని సాధుజనుఁడు కాసువీసంబీయఁ
దృష్టివడఁడు ధరణిదేవుఁ డౌర!

6

బహుళదుర్గుణపరివృత బ్రాహ్మణుండు
దానసంగ్రహణైకవిద్యాగురుండు
శ్రుతులఁ బఠియింప నర్హుఁడు సుగుణవర్యుఁ
డురుయశుండగు శూద్రుఁ డర్హుండు గాఁడు.

7

విధవయయ్యెఁ బ్రసవవేదన మృతిఁజెంద
స్వర్గపురికి దాని సాగనంపు
ద్రవ్యమున్నఁ, బేదరాల్ సాధ్వి దివికేగఁ
దిలకమైనఁ గొనఁడు ద్విజుఁడయారె!

8

మేడిపండుజాడ మెలఁగెడి టకటొంకు
నాదరమున నజ్ఞులైనఁ గాంత్రు;
డాబులేనివాని దగ్గఱఁ జేర్పరు
ప్రజ్ఞఁగల్గునట్టి ప్రజలుఁ గూడ!

9

కల్లు సారాయి గంజాయి కైపుమిగుల
క్రోలి సోలెడి బంగుభాయీలు ద్రవ్య
వంతులుగ నున్నసభ గౌరవంబుఁ గాంతు;
రెద్దడింగుండు సుజనుల నెవరుఁ గనరు.

10

ఇల నధర్మవిచేష్ట లెన్నెన్ని కలవో ?
అన్నియుంగల్గు ధనికుండె వన్నెకెక్కు
సర్వసద్గుణసముపేత సాధుజనుఁడు
బీదఱికముకతంబునఁ బేరుఁ గనఁడు.

11

సత్ప్రవర్తనమ్ము శౌచమ్ము లేనట్టి
బ్రాహ్మణుండు స్తోత్రపాత్రుఁ డగును
అవ్వియుండి పరహితాదృతిఁ గలమాల
వానిగాలి పీల్ప రానిదంట.

12

కడుపుదించుకొన్న కాంత నవీనంపుఁ
గళలఁ దళుకుబెళుకుఁ గలిగియున్న
నేఁటి నాగరకులు నీటులకుప్పొంగి
పెండ్లియాడి వెనుక వెతలఁ గంద్రు.

13

ముక్కు మొగము గోనము । చక్కనిదైనను
పేదవారిబిడ్డ । ప్రియము నిడదు;
క్రోఁతిమొగము పాడు । గోనము గల్గినదైన
గొప్పవారిబిడ్డ । మెప్పుఁ గూర్చు.

14

బానిసతనంపు టుద్యోగ । వాంఛఁ దవిలి
నేర్చి రాంగ్లము నాస్తుల । నీటఁ గలిపి
తుదకు నుద్యోగమును లేదు । బ్రదుకుకొఱకుఁ
జేఁతిపని రాదీకం జెప్పె । జీవరక్ష.

15

స్వకులవృత్తులు దోషదూ । ష్యంబులయ్యె
జాతిహితధర్మతతి దు । రాచారమయ్యెఁ
బెద్దలపథంబులును గొల్ల । సుద్దులయ్యెఁ
బ్రకృతి వికృతిగ మార్చిరి । పంచజనులు.

16

దుర్ధనికజన దుస్సహా । దుర్వివేక
నిత్యనూతన దౌర్జన్య । నిగళబద్ధ
దీనకర్షకలోక మెం । తేనిఁ జావ
పెద్దలు స్వతంత్రమార్జింప । పెనఁగుటేల ?

17

నీతియే లేక చదువులం దిట్టయగుట
కన్నఁ జదువక నీతిసంపన్నుఁ డగుట
యెంతయును మేలు నరున; కదేలయన్న
వానిచే దేశ మభివృద్ధిఁ బడయఁగలదు.

18

విద్యతో జీవనోపాధివృత్తి కలుగఁ
గృష్ణపక్ష విరహిత పూర్ణేందుఁ డగును
జీవనోపాధివృత్తితోఁ జెలఁగ విద్య
లేమి రాహువు కబళించు సోమువగిది.

19

ప్రకృతి కనుయాయులై వేషభాషలెల్ల
మార్చికొని భ్రష్టులై సత్యమార్గవిముఖు
లై చరింతురు పైకి సత్యరతులట్టు
లరయఁ జెలుపన చేటలో నరులు జగతి.

20

మూలకందము సంసారమునకు స్త్రీలు
స్త్రీలకున్ విద్య నేర్పుట శ్రేష్ఠమగును;
విద్యవలన వివేకమ్ము వెలయుకతన
సముచితంబుగ నడుపు సంసార మతివ.

21

లంగరులముంచు వ్యాపారులకు నపేక్షి
తార్థసిద్ధియు సత్యమార్గానుగామి
కీప్సితవిఘాతసంభూతి యేల! యిదియు
భగవదాదేశమో! లేక ప్రకృతిబలమొ!

22

ధనికునిఁ లుబ్ధునైనఁ బాతకునినైన
ఘోరదారిద్ర్యపీడితుల్ చేరవలయుఁ
జండమార్తాండ సునిశితోజ్జ్వలనతాప
భారతపుత్రులు ముసిఁడి నేఁ జేయునట్లు.

23

విశ్వములమ్రింగు తమబొజ్జ పెంచుకొఱకు
నగతికుల ఱేయుఁ బవలన కష్టకష్ట
మునకుఁ బాల్సేసి నెత్రుకండలు హరింపఁ
బనులుఁగూర్తురు వీరెపో దనుజులనఁగ.

24

ప్రాజ్ఞతయె లేక యోగ్యతాపత్రమొందు
యెటులొగాంచిన యవినీతుఁ డెవఁడొ యొకఁడు
బుడుతలకు విద్య నేర్పంగఁ బూనుకొన్న
నెన్నటికిఁ గడతేరునో కన్నతల్లి!

25

అన్నిసంస్థల కధ్యక్షు ఽ లైనవారె
తాముపల్కిన పల్కులఁ ఽ దప్పి స్వార్థ
పరత గుడుగుడుగుంచాల ఽ పగిది నడువ
నితరు లపమార్గమునఁ బోవు ఽ టేమివింత?

26

కూటికిని గుడ్డకును వాచి ఽ కోవిదాళి
యాత్మదేశాన నూపవే ఽ రడఁగి చావ
నన్యదేశస్థు పండితంమ్మన్యు నొకని
గౌరవించుట యాంధ్రుల ఽ కర్మమమ్మ!

27

ఎంతవాఁడైనఁ దమవాని ఽ నేవగింతు
రల్పుఁడయినను బరుఁడయిఽనంత జనులు
బ్రహ్మరథమును బట్టఁగఁ ఽ బాఱుచుందు
రరరె! పొరుగింటి పుల్లగూఽర రుచి కాదె!

28

నాల్గుకాసులు చేరిన ఽ నాఁటినుండి
వంటవార్పుల పనులకుఁ ఽ బానసీంద్రు
వలసియుండుట కండలు ఽ బలుపుఁజెంది
వంధ్యతకు రుజలకు స్త్రీలు ఽ పాలువడిరి!

29

పాలికో! పన్నునకో! యీయఁబడినభూమి
దున్నుకొని మనుబీదరైతునకు దానిఁ
దక్క నీకుండ లేని నిందలిడి ధనులు
వెతలనిడుదురు తమమాట విననియంత.

30

బక్కచేఁపలఁ బెద్దచేఁపలు భుజించు
కరణిఁ గడుఁ బేదపడినట్టి పొరుగువారి
నొక్కటిగఁ జేరి బల్లిదుల్ త్రొక్కఁగొనఁగ
యత్నమొనరింతు రిది నైజమయ్యె జగతి.

31

పాలబుగ్గల పసిమియు వచ్చిరాని
కురులు నవ్యక్తవాక్కులు గోచి కోక
గట్టఁ దెలియని బాల్యముఁ గలశిశులకుఁ
బరిణయము సేయు పెద్దలసురలు గారె!

32

ముక్కుకొనపచ్చలారని ముగుద నకట!
గృహదరీస్థితభర్తృదుర్గ్రహమువాతఁ
ద్రోయ సుఖమామె కెటులబ్బు ధీయుతులును
బలసమేతులు నగుసుతుల్ గలుగుటెట్లు!

33

శాస్త్రములఁ జూచి లౌకికచర్య లెఱిఁగి
బుధుల మనుకొన్న పురుషులె బుద్ధిఁదప్ప
నిఁక నుపజ్ఞత లేనినాతుకలు మగలఁ
గలిసి బాల్యాన సంసృతిఁ గడవఁగలరె!

34

సుగుణయుతుఁ డెందుఁ బుట్టిన నగుద్విజుండె
దుర్గుణుం డెందుఁ బొడమిన దూష్యకులుఁడె
కులముతో నేమి? గుణములు గలుగలేని?
అధివసించును గుణకర్మలం దె కులము!

35

నాల్గుకాసులు గలిగిన నాగరకము
బలిసి పనిపాటులకు మేను వంగ దింత;
సోమరితనాన సాపాటు సాములగుట
హైందవుల కల్మిబల్మి రూపఱె నిజంబు.

36

సంకెలల దొంగ, యుచ్చునఁ జనుఁడు, వలను
పక్షి, ముకుఁద్రాటఁ బశువును బాధనొందు
నట్లు, ధనికులచే లోకు లనుభవింతు
రకట! కొసయూపిరాడని యాతనముల!

37

క్షీరముననుండి తెలుపును ఽ వేఱుసేయ
వీలులేనివిధంబున ఽ నాలుమగల
ప్రణయభావము విడఁదీయ ఽ వలనుపడదు
అది త్రికాలములకు నబాఽధ్యంబుగాదె!

38

కన్నతలిదండ్రులెడ శ్రద్ధఁ ఽ గననికతన
గురు లుదాసీనభావులై ఽ పరఁగుకతన
భావినాయకు లనఁదగు ఽ భరతసుతులు
విగతమతు లల్పశక్తులు ఽ భీరువులును.

39

ఇంతులకుఁ గోఽకలపయిని ఽ సంతతిపయి
నగలపైనున్న యాకాంక్ష ఽ స్వగృహాకృతుల
దేవభక్తిని దేశసంఽసేవయందు
వెలయ నెంతయు లాభంబు ఽ గలుగుఁగాదె!

40

ఎప్పు డేకతఁ బెంపంది ఽ యెల్లజనుల
యాదరముగాంచుఁ గనిపట్టి ఽ సందుఁజేరి
తద్విధులకు గులాములై ఽ దానినాయ
కులకొనర్తు సలాములు ఽ గొందఱకట!

41

నూఱుగురు పేదరైతుల । నోటికూటి
పంటమేసెడు ధనికుని । బత్తెనేని
బోలము వెడలింప శిక్షాస్మృతులకు వారు
పాత్రులగుదురు దౌర్భాగ్యవశతఁ గాదె!

42

ఐకమత్యవిహీనత్వ । మలసుఁదనము
భౌతికేచ్ఛాపరాఙ్ముఖత్వమపనింద
దేవునకుఁ బెట్టుటయు భారతీయజనుల
సహజగుణములు గాన । దాస్యమ్ము ప్రబలె!

43

బహుళశిష్యార్జనమ్మునఁ । బలుకుబడియు
నర్థసంచయమును హెచ్చి । యైహికసుఖ
జీవనమునకు సాయమ్ము । సేకుఱునని
గురువు లూహాపవృత్తిమై । తిరుగుచుంద్రు.

44

వంచకుల మెఱమెచ్చులఁ । బడయనెంచి
దండుగగు షోకులకు డబ్బు । తగులబెట్టి
కడకుఁ దినుటకుఁ దిండియుఁ । గట్టబట్ట
లేక పెదపెద్ద సాహుకార్లే! తపింత్రు.

45

ఇంటనింటను గయ్యాళు లుంటకతన
కంటికిం బచ్చనగు కల్పకములవంటి
బహుళసంసారములు చీలి పాడువాఱి
చెట్టుకుం బుట్టకొకఁడయి చెడఁగవలసె!

46

కన్నబిడ్డలరీతి దగ్గఱకుఁ జేర్చి
వేళవేళకుఁ దగుమేఁతఁ బెట్టి ప్రేమ
మనిచి తుదకొకదినమున మమతవీడి
గొంతుకోయుదు రల్పులు జంతువులను.

47

అదను గనిపెట్టి వినయంబుఁ గదురఁ జేరి
మ్రొక్కి వేఁడినఁ బనియౌనె? మూర్ఖుచెంతఁ
గఱకుఁ జూపక చెఱకును నఱికి నమలి
పిప్పిసేయక రసము లభింపఁ గలదె?

48

సహజగుణమగు వంచన మహరహంబుఁ
దమకు సహకారియగుచుండ ధర్మపథము
మఱచి సత్యము విడిచి యమానుషముగ
మెలఁగి వణిజులు ధనులయి చెలఁగుచుంద్రు.

49

వెఱ్ఱివేదాంతములు వ్యర్థభేషజములు
టక్కుజ్యోతిషములు మంత్రతంత్రములును
సోమరులఁ జేరి భారతభూమి యంద
లేమిడికిఁ గారణంబయ్యె నేమి చెప్ప!

50

అబ్ధినీరము కల్లు హిమాద్రి నంజు
డయి ప్రభుత్వపుఁజట్టము లడ్డుపడక
స్వేచ్ఛ యొసఁగిన సంతృప్తిఁ జెందునేమొ?
మద్యపాయికిఁ గల్గిన మధుపిపాస.

51

ధనము దనయింట మూలుగు తరుణమందు
నపరిచితులును బరిచితు లటు చరింతు
రది తొలంగిన నందఱు నపరిచితులె?
ధనము తిందురొ? కఱఁగించి త్రావఁగలరొ?

52

క్రూరమార్గానుచరులముంగొంగుఁబసిఁడి
భయదహంతకులింటికల్పద్రుమంబు
కలుషరాసులకొట్టానఁ గామగవియు
భాగ్యదేవత! సాధుల పాలిదగునె?

53

క్రుంగఁదీసెడు ఋణభార ౯ ఘోరరుజకుఁ
బాలుపడి దేశ మెంతయుఁ ౯ బ్రభ సెడంగ
నర్థమును దుర్వ్యయంబుగ ౯ వ్యర్థపఱచు
డాంబికుల తెల్వి వట్టి వేఁడబము కాదె!

# రాజకీయము.



పామునోటను జిక్కు కప్ప యెటు లీఁగ
లను దినఁగనెంచు ద్రావిడులకును జిక్కు
నౌత్తరాంధ్రులు మఱి పశ్చిమాంధ్రు లిటు
లాపిడియునప్ప నెటులాంధ్ర రాష్ట్రమబ్బు ?

2

గుండెపైఁ బెట్టుకొని చేయి నిండుహాయి
నిదురఁ గైకొనుదినము లెప్డొదవునొక్కొ
నీచతమదాస్య శృంఖలానిబిడబద్ధ
కృశశరీరుల కీనాఁటి హిందువులకు.

3

ఇహము నశియింపనీ పరమేటఁ బడని,
సత్యధర్మదయాదులుఁ జాటువడని,
ద్రవ్య సంపాదనైకకార్యమ్ము దప్ప
నేఁటిప్రభువుల కింకొక మాటలేదు.

4

ఉద్భవంబాది పరహింస యుగ్గుపాలు
పొలుచునన్నాళ్లు ద్రవ్యాశ పోఁతపాలు
తల్లిపాల్ ద్రావుభాగ్య మెందఱకుఁ గలదొ ?
ధర్మవిద్రోహరాజ్యతంత్రజ్ఞులందు.

5

రాజరాజుల సర్వసామ్రాజ్యవైభ
వాళి యొకతెప్పపాటులోఁ గూలిపోయె;
అట్టి సంక్షోభమునఁ బ్రజ కెట్టి సుఖము
కలుగ నేర్చును బలితంపు సిలుగు గాక!

6

సంఘసంస్థలసభ్యత సంతరించు
నార్యు లాదర్శనీయ సమాచరణము
కలిగియుండనికతన జగంబునందు
నరులు తలకొక్క దారిఁబట్టి రిది నిజము.

7

ఊహాలన్నియుఁ గృత్రిమవ్యూహములకు
దారితీయుచు సంకుచితంబు దృష్టి
నెదుగఁ జేయంగ నార్యుల కెట్లు గలుగు
తేజుఁ గూర్చెడు స్వాతంత్ర్యదీప్తులెడఁద!

8

పసులమేఁతయు నిండారు పాడిపంట
లింటికగు నుపకరణము లీదకంబె
చులకనగుచున్న సమతయుఁ గలుగునెడల
రైతుబిడ్డ మతేమి కోరంగలాఁడు!

9

స్వాత్మసేవకు ధనమేని మానమేని
ప్రాణమేనియుఁ దృణలీల వదలవలయ
క్షాత్త్రచరితము దీని కుదాహరణము
గాదె! యాతం డఖండవిఖ్యాతిఁ గనఁడె

10

పసఁగు పేకలట్లుఁ బాలకపాలిత
సమరసంబు నెచట నమరు నచట
రాజ్యకోశసుస్థిరత్వమ్ముఁ బొనుపడుఁ;
నట్లు గాకయున్న నగును వెతలు.

11

దాస్యముద్రాకురములచేఁ దనరుచున్న
నపహాసంపుఁ గథల్గల హైందవాళి
పూర్వచారిత్ర మొంటరపుగా విదేశ
జనులచేఁ జిక్కునద్ది సంస్కరణ మగునె

12

ధర్మరతిమై నశించు హైందవులయ గతి
కత్త్వము గణించి ధార్మికకార్యవిముఖు
లగువిదేశీయు లీరాజ్య మధిగమించి
యాత్మజీవనలక్ష్యమ్ము నందఁగనిరి !

13

వేకువను లేచినదిమొదల్ ఽ వెఱ్ఱిమొఱ్ఱి
వాదముల నాడుచును బరఽభాగ్యజీవు
లగుచుఁ గర్మపరిభ్రష్టు ఽ లలసమతిని
దిరుగ దేశవిముక్తి యేఽసరణిఁ గలుగు ?

14

విషమమతములు భిన్నతాఽవిషయకములు
బలిసి సంపత్కళల విప్లఽవంబునకును
బతనమునకుఁ గతంబు లౌఽకతన భరత
దేశదారిద్ర్య మెంతో వృఽద్ధిని వహించె.

15

స్వపరిపాలనదక్షత ఽ సామ్యబుద్ధి
సర్వజాత్యైకమత్యము ఽ సాగఁ బ్రజలు
రాజ్యతృష వీడి చనుఁడని ఽ ప్రభుల వేఁడ
విడగు దయ్యాలువోలె దోఁఽపిడిని మరిగి.

16

చేతిపనులు లేక ఽ సేద్యంబు నేర్వక
"విద్య విద్య" యంచు ఽ వెఱ్ఱిపట్టి
నగరవాసమును ధనఽవ్యయమును జేసి
బడుగులగుట సిగ్గు ఽ భారతులకు !

17

పేక్షోకఁడు వృద్ధిసెందిన । వెన్నుఁ జఱచి
తన్నుఁ గొనిపోవునేమొ యాత్మ । యశ మనుచు
నగచు పెద్దలస్వార్థైక । పరతచేత
భారతీయులకళలెల్లఁ । బాడువాఱె.

18

కించిదుద్యోగబలము నా । ర్జించినట్టి
యల్పబుద్ధులు రైతుల । నష్టకష్ట
సమితిపా ల్సేయుదురు వారె । తమకునెపుడు
జీవరక్షకులంచు యో । జింపలేక !

19

బీదరైతులరక్తముల్ । పిండి పిండి
యాసవంబు లొనర్చి ద్ర । వ్యాఢ్యు లకట !
పలుకుబడి పేరుగలుగు పె । ద్దలకు నిచ్చి
వారినుతులందఁ జూచుట । పాడియగునె ?

20

రాజ్యకాంక్షాతిపిశునభూ । రమణఘాటి
కల్పమానవు లాగక । యాత్మబలము
గ్రుంగ సంక్షోభమందిరి । గోడువాపి
విశ్వకల్యాణ మెవఁడు గా । వించునొక్కొ !

21

గౌరవాంచితపదములఁ గాంచఁ గోరి
దేశసేవకవేష మెంతే ధరించి
ప్రజలఁ గికురింపఁ జూతురు వంచకులగు
స్వప్రయోజనపరు లిది సాధుమతమె ?

22

తమనిరంకుశచేష్టలఁ దాళలేని
ప్రజలు మాకేకరాట్ప్రభుత్వంబె యింక
వలదు వలదని చాట ! దేశవశములందు
నందులంబలె నృపులు గూర్చుందురేల ?

23

ప్రజకు విముఖతఁగూర్చు సూత్రములుగల్గు
దొరతనంబున నధికారవరు లొకింత
లోకహితమెంచుమాత్రఁ గల్గునె ఫలంబు
బానిసవదాన్యగుణ మెంతవఱకు జరగు.

24

జన్మపుహక్కు స్వాతంత్ర్య మన్మహార్థ
మొకఁ డొసంగఁడు దాని వేఱొకఁడు గైకొ
నంగఁ జాలఁడు కష్టార్జనమున నదియ
దొరకునప్పుడె ! దాస్యపుఁదెఱయుఁ దొలఁగు.

25

దుర్బలులపై బలిష్ఠులదోర్బలమ్ము
నకు జయంబాదినుండి యెంతయు నిజంబు
కాని యది శాశ్వతజయమ్ము గాదు తలఁప
దైవకృతధర్మసూత్రాళి దాఁటి చనుట!

26

ప్రబలసంతాపకరవిషవాయుశక్తి
గుములుగుములుగఁ బ్రాణులఁ గూల్చి యదియ
రణజయంబని పాలకాగ్రణులు మిన్నుల
విఱ్ఱవీఁగెద రిఁక ధర్మవిధు లెసఁగునె?

27

పలుకుబడి గల్గి ముందంజ వైచి జనుల
యాదరము గాంచుపక్షంబు నట్టె తెలిసి
కొంకకయె యందుఁ జొత్తురు గోడమీఁది
పిల్లులంబోని కొందఱు పెద్దలెపుడు.

28

చండమారుతహతికిఁ బ్రజ్వలితమగును
కాఱుచిచ్చుల దీపమో యారిపోవు
నట్టు లీరాజకీయవాతావరణము
బలయుతులఁ బెంచు బీదరైతుల నడంచు.

29

సత్కళావిదు లక్కట § స్వహితపరత
నితరులకు నాత్మవిజ్ఞాన § మీనికతన
భారతీయుల పూర్వ§కళారహస్య
వితతి నశియించెఁగా § యూరుఁబేరు లేక!

30

అనునిమేష మిసుళ్ళపో§ల్కిని మరణము
పొందుదురు పిఱికిజనులు § పోటుబంటు;
ఒక్కసారియె చత్తురి § నిక్కమెఱిఁగి
వీరుఁడవు కమ్ము! ముక్తికై § భారతీయ!

31

పశుబలము జూపి విపదబ్ధిఁ § బ్రజల ముంచి
యమితరాజ్యము చేకూర్చి§నంత నేమి?
శాంతి శివసుందరంబు § లెసంగవేని
కాఱడవి కీడు మఱి వల్ల§కాటి జోడు!

32

కల్లబిరుదాలకయి ఘనుల్ § కన్నవారి
యడుగులకు మడుగులనొత్తి § యవ్విగాంచి
సురపతిపదంబునొందిన § కరణి సభలఁ
గులుకుదురు జనులను లెక్క § సలుపరింత!

33

ప్రజలొసంగిన సభ్యతాపదవి కూడఁ
దనమహోన్నతశక్తిచే నొనరెనంచుఁ
గుమతి దలపోసి జనులఁ గన్గొన నసహ్య
భావముంజూపు నిట్టిఁడు ప్రతిభఁ గనునె?

34

ఫలము గలదొక్కొ! బహువిధనిర్బంధశాస
నములు నిర్మింపఁ బ్రజల మానసికవృత్తి
చక్కఁ బడదేని గాన నీచంద మెఱిఁగి
పూనుకొనఁ దగును జనప్రబోధమునకు.

35

రాట్నము! సుదర్శనంబు, స్వరాజ్యకారి,
మానహీన జనావన దీనరక్ష,
క్షుద్రదారిద్ర్యదళన, ప్రోక్షుభచరిత్ర!
ఆర్యభూదాస్యశృంఖలహారి! నిజము.

36

పెట్టుబడిదారు లిడువెతఁ గట్టి యేడ్చి
పాటకజనంబులొడ్చు కన్నీటివఱద
పాఱి పండించుచున్నది భరతభూమి
దుర్భరాత్యంతదారిద్ర్యదుష్ఫలంబు!

37

ధనమదాంధులయాధిపత్యమ్మునందు
ప్రజకు స్వాతంత్ర్యసౌఖ్యమ్ము స్వప్నవార్త
రైతువారతన మెప్పు డేర్పడునో? యప్పుడ!
యందఱకు సంపదయు స్వేచ్ఛయనఁ దెలియును.

38

ఉదధులున్నవి ప్రజఁదిన నుప్పు లేదు
అండవులున్నవి పసుల కాహారమసదు
పాఁడిపంటలు గల వసుభవము సున్న
యెఱుకఁ గల దాత్మబలమిల్ల హిందువులకు.

39

ఒకరిపైఁ బెక్కురాధార మూనియుంట!
యాచనకుఁ బూనుపని దొంగ లధికమగుట!
సిగ్గువీడి బుతేతర జీవులగుట
భారతీయులదారిద్ర్యభరము హెచ్చె.

40

ముందుననెనిల్చి యాదర్శపురుషులగుచు
గ్రామపునరుద్ధరణముకై కడఁగకుండ!
నెన్నిసంస్థలు నెలకొల్పి యెంతలేసి
సభల నొనరింపనదియెట్లు సఫలమగును!

41

చొక్కమగు చందనపుఁజర్చ ఽ సోపతా
మాపుటయగాక! తావి పెఽల్లదరఁజేయ
నాయకు లొనర్చుపనులు దేఽశీయజనుఁ
జక్కఁ జేయుటయే గాక ఽ చాటునీతి.

42

హెచ్చుపదవులవారలు ఽ పుచ్చుకొన్న
లంచములనేనిఁ గానుకఽలంచు నెంచి
పేదయుద్యోగులు గ్రహించు ఽ బిచ్చపై
లంచములని వచించు కేఽలాటినీతి ?

43

ఆంగ్లవిద్యాధికుల హాళాఽహాళికి జంకి
యాంధ్రులెల్ల బరాబరు ఽ లవఘుళింప
మొదలిడిరి సహజమే గద! ఽ మొదటఁ
చెవులకన్నను గొమ్ములు ఽ మిపులనేటుఁ!

44

నెత్తురుంబోని చెమటలు ఽ నేల రాల్చి
పంటపండించు రైతుచేఁ ఽ బన్నులూడ్చి
యుడుపులకో ? పడుపుఁజెలులకో ? ఽ కఁ
ధనము వెచ్చింతు రీజమీంఽదారు లేల ?

45

కూటికిని గుడ్డకును దొడ్డ కాటకమ్ము
నష్టకష్టాలు జీవితమందు విసుఁగు
బానిసతనమ్ము నాజన్మ ఫలము ప్రజకు
భరతసంస్థానపతుల యేల్పడిని నేఁడు.

# జిజ్ఞాస.



సహజమో! లేక దైవికశక్తియుతమొ!
యేమియో సృష్టిలోఁ గుట్టు నెవ్వఁ డెఱుఁగుఁ
గాని యూహింప దీనికిఁ గారకుండు
గలఁ డొకండని మదిఁ దోఁచి యలరుచుండు.

2

పొత్తమాద్యంతముగఁ జూచుబుద్ధి లేక
బహుళ శాస్త్రావలోడనప్రజ్ఞ లేక
ఆటనటం గొన్ని పంక్తు లప్పటికిఁ జదివి
బుధులు కొందఱు ఖండనములు లిఖింత్రు.

3

వయసుఁదనమున వగలాండ్ర ప్రక్కఁ జేరి
ముద్దుముచ్చటలను బ్రొద్దుపుచ్చి తుదకుఁ
గాటికిం గాలుచాఁచిన కాలమందు
జతన మొనరింప భక్తి యేసరణిఁ గలుగు.

4

కూటిపేదకు సంతతి గుంపె డొదవు
ధనికవరునకుఁ బుత్రసంతతియె లేదు
ఇట్టి విపరీతసృష్టి నీ వెందుకొఱకు
సలుపుదువొ? తల్లి! యెఱుఁగంగ శక్యుఁ డెవఁడు.

5

పసరపున్మతిఁ గల్గిన ఽ పాపకృతికి
సర్వలక్షణ సంపన్న ఽ సాధ్వియబ్బు
ధర్మమతికిఁ గులక్రమో ఽ దారకృతికిఁ
బ్రబల దుర్గుణదూషిత ఽ ఱాఁగయబ్బు.

6

సత్యధర్మేతరక్రియా ఽ చరణముననె
వచ్చుధనమున నొకకొంత ఽ వెచ్చఁబెట్టి
యేదో ! జనహితకృతి చేసి ఽ యెటులో పేరు
లోకమునఁ గాంచనెంతురు ఽ లోభిధనులు !

7

దమముగల్గుమునుల ఽ దాసుల నొనరించు
ననుభవించుకొలఁది ఽ యాసఁ బెంచు
పారమార్థికస్వ ఽ భావంబుఁ దొలఁగించుఁ
గామమెంత తీఁపి ఽ గలదో? కనుఁడి.

8

సకలశాస్త్రపరిజ్ఞాన ఽ చతురుఁడేని
కామసందీప్తవహ్ని ఽ క ఽ గ్గమయి కాలు
శలభముంబలె, సహజవి ఽ జ్ఞానపటిమ
మున్న నేమాయె దృఢదీక్ష ఽ యొదవవలయు.

9

సకలజగదుపకారులఁ । జంప నొంప
హంతకుల కిచ్చితివి ప్రీతి । నమృతరసము
దీనలోకంబు దెసమాలి । తిరుగసురుఁగ
నతికృపాత్ముల కిచ్చితి । హాలహాలము.

10

ఆశతోఁ గూడినది కాదె! । యఖిలజీవ
సమితినాటక మీ ప్రపం । చమునఁ గనఁగ
నట్లుగాకున్న నన్యోన్య । మాశ్రయింపఁ
దగినపనియేమి కలదు? మి । థ్యాజగమున.

11

తా రచించినగ్రంథ ము । త్తమమటంచుఁ
బేరుఁగల బుధరాజికై । వారములను
గాంచినంతన సరియె, త । ద్గతగుణములు
దోషములు లోకమున కింత । తోఁపకున్నె?

12

అమృతసమరసభరితంబు । లమితవీర్య
పౌష్టికారోగ్యదములు నౌ । పండ్ల వీడి
కృత్రిమపదార్థములఁ దిని । త్రేఁపి వ్యాధి
పీడలకుఁ బాల్పడుదురు రవి । వేకిజనులు.

13

ప్రబలశత్రువు మిత్రుఁడౌఁ; బనికిరాని
వస్తువేదైన మదిఁగూర్చువస్తు వగును;
వర్జనీయ ముపాదేయవస్తు వగును;
అవసరమదెంత విలువ గలట్టిదౌర!

14

ఎట్టిప్రశ్నకే నుత్తర మీయవచ్చుఁ
గాని సృష్టినిఁగూర్చిన దానికెట్లు
తృప్తికరముగ నుత్తర మిడఁగ నగును?
నీరధి బిందువులను గణించు టెట్లు?

15

ధనమమరకుంట, బానిసతనము, జనుల
ప్రోద్బలము లేమిఁ, బరిహాసమును, ప్రభుత్వ
మెప్పు డుత్సాహ మొసఁగమి, నెల్లప్రకృతి
శాస్త్రపరిశోధనంబులు సన్నగిల్లె!

16

రైతులనుదోఁచు వర్తకప్రజకు మేలు
సకలజనహితకరసాధులకును గీడు
కలుగు; నిది యీశ్వరాదేశబలమొ? కాక
ఆత్మశక్తియొ? నైజమో? యరయుటెట్లు?

17

స్నానసంధ్యాద్యనుష్ఠానసమితి సలిపి
భగవదర్పితమని భుజింపఁ దలఁకొనంగ
మొదటికబళమె విషమయి మోసగించు;
దైవసంకల్ప మెవ్వరు దాఁటఁ గలరు ?

18

అంతరరివర్గదాసులై యాత్మశిష్య
నిచయమునకుఁ గుతర్కముల్ నేర్పి లోక
హితులపై నుసిగొల్పుచు బ్రతుకునట్టి
గురులు! గురులొక్కొ? పాపవాగురలు గాక!

19

ఆర్తరక్షణమెల్ల ధర్మాళికిరవు
దీనజనముల యాపదఁ దెలిసి వానిఁ
గడపి కాచుట కీడౌనె? క్షాంతి దాంతి
సత్యకరుణా తపోదాన శౌచవిధులు.

20

స్వార్థభావం బసూయ కోపం బశాంతి
యంతరరివర్గదాసత్వ మనృతహింస
లడరు తాపసులెట్లు బ్రహ్మర్షులైరో ?
వారివాక్యము లెట్లు, సఫలములయ్యె ?

21

తల్లి ! నిను నమ్మి యున్నట్టి । దాసకోటి
మూఁడుపూఁటల కొకపూట । కూడు లేక
కుములుచున్నారు; నీదవు । క్రమపరీక్ష
తొలుత నిటులుండునని చూపుదువె ? రవంత !

22

ప్రజకు నిండోలగమున నుపన్యసించి
యింటికింబోయి చెడుత్రోవ । నంటితిరుగు
నార్యు లాదర్శమూర్తులై । యమరకునికి
నాత్మ మతభావవిధులు కూలాఱిపోయె !

23

సర్వసర్వంసహాభర్త । సరస కరిగి
పూటబత్తెమ్ము యాచించు । మూర్ఖపగిది
నీశు సర్వజ్ఞుఁ జేరి యైహికసుఖములు
వేఁడుమానవుఁ డెంతయు । వెడఁగుగాఁడె.

24

సార్వభౌమపదంబె హ । స్తగతమైనఁ
గోరినవి కోరినట్లు చేకూరియున్న
నేదియో యొకకొఱఁతచే । నేడ్చు నరుని
యాస కెదితుద ? యదివీడు నతఁడె ఘనుఁడు.

25

భోగమే కూడు; సైదోడె రోగసమితి;
మరణయాతనమె వియోగసరణి; నేఁటి
ప్రజల కింతకుమించి తోఁపదొకో? పార
మార్థికవిచార మిసుమంత యాత్మలందు.

26

మరణ ముత్తమకృత్యకు మార్పటంచుఁ
దెలిసియును మమకారంబుఁ దొలఁగఁద్రోయ
రకట! మానవు లెంతటి యజ్ఞులోకద!
మోక్షమన చొడ్డికల్పక భూజమేమొ ?

# వివిధవిషయములు.



అనుభవజ్ఞాన మిసుమంత ఽ యైనఁ గనక
పూర్తిగాఁ దెల్సి గ్రహియించు ఽ బుద్ధిలేక
కేవల గ్రంథవిషయాల ఽ దేవులాడి
యడలుచున్నారు నేఁటివిఽద్యార్థు లంబ!

2

నేఁటి విద్యావిధానముల్ ఽ నీతిమాపి
యంగబల బుద్ధిబలముల ఽ నపహరించి
భోగలాలసతం బెంచి ఽ త్యాగ మణఁచి
యిహపరవిదూరులను జేసె ఽ నెల్లవారి.

3

ఇహపరంబుల రెంటను ఽ నెలమి నొసఁగు
విద్యయే విద్య యగుఁగాని ఽ విత్తదాయి
యగుచుఁ గుక్షింభరత కుఽపాయంబుఁ జూపు
నంతమాత్రాన నది విద్య ఽ యనఁగఁ దగునె?

4

పృథివి, విద్యాధికారులు ఽ విద్యకెపుడు
నధికముగ నరులయి యుపాఽధ్యాయులకడ
లంచముల బలవంతాన ఽ లాగి బొజ్జ
వెంచి; రర్భక మేధస్సు ఽ పెంచరయ్యొ!

5

శబ్దసంగ్రహమిల్ల, శాస్త్రప్రసక్తి
నాస్తి, పూర్వప్రబంధ విజ్ఞానపటిమ
మరుదు, లౌకికబుద్ధియుఁ గఱవు, నేఁటి
కవులమనుకొను కొందఱకవుర! తగునె?

6

వంగచిత్రకళల్ పాషాణభంగిమలును
కొసరి చవిఁజూచి యనుకరింప సరియగునె
సిద్ధహస్తముఁ బ్రకటించు శిల్పకళలు
హంపి, యమరావతి, యజంత నరసి బుధులు.

7

అందఱుద్యోగులైన సేద్యంబొనర్చి
పంట పండించి బత్తె మెవ్వఁడు గూర్చు;
ధనము దిగమ్రింగి నీరుఁద్రావి నతఁడు ధాత్రి
దీఱునే యించుకంత యెవ్వారికైన!

8

ఒకగతి పరాఙ్ముఖమున, వేఱొక్కరీతి
సమ్ముఖమ్మున, వర్తించు జనులకాత్మ
యనున దింతైనఁ దమకున్నదంచు విశ్వ
సింతురో? లేదొ? వీరె వంచింత్రు జగము.

9

ఇస్సి! వాఁడెంత వీఁడెంత ౹ యెఱుకయందు
నన్ను మించినవార లీనాఁడు గలరె?
యందు రాకకొంద ఱరయని ౹ యజ్ఞులకట!
కలఁడు సర్వజ్ఞుఁ డొకఁడను ౹ తెలివిలేక!

10

నాదు పేర్విన్న మాత్ర వెన్కకును బాఱు
నెట్టి రోగంబులైన; నీకేల శంక?
పంచబంగాళమయ్యె నీవ్యాధి యిదిగో?
యనుచు వదరుఁ గ్రియాశూన్యుఁ ౹ డైనవెజ్జు.

11

రోగసర్పంబుఁ గబళించి ౹ రూపుమాపఁ
జేయుసమయాన వైద్యులీచెంతఁ జేరి
నీవె! తల్లివి తండ్రివి ౹ దైవమంచుఁ
బొగడి పనిదీఱ నాతనీ మొగముఁ గనరు.

12

పత్రికలఁ బేరువడుటకో! ౹ పదవులకునో!
ధనముకొఱకో తాత్కాలికోత్సాహముననో
యితరులు హాసింతురనియొ ౹ సద్ధితులబోధ
నముననో చేరుదురు, నవోద్యమములఁ బ్రజ.

13

ప్రకృతిసిద్ధౌషధులఁ గాంచు ప్రజ్ఞ లేక
కృత్రిమపురసవిషముల మ్రింగి యొడలు
చెఱుచుకొననేల ? ప్రజలెల్ల గుఱుతెఱింగి
కనుఁడి, యారోగ్యదేవతఁ గన్నులార !

14

కడుగుతొట్టి, విశుద్ధమౌ నెడప దడప
నెండఁ బెట్టుచునున్న నళ్లే యుపోష్య
విఘుల నుదరంబు వాడ్చిన వెజ్జుతోడ
నేమికార్యము ? మందు లింకేల వలయు ?

15

కుడుచువెంటనె, మూత్రమ్ము విడుచుటయును,
నెడమప్రక్క పరుండుట నొందుఁగాని,
మితవిధానము బట్టు, టీగతిఁ జరించు
వారి కారోగ్యభాగ్య మవ్వారిగాదె !

16

అలజడింగూర్చి కష్టలఁ గలుగఁజేసి
యాసఁజూపి నిరంకుశ మంత జరపి
లంచములనిచ్చి యెట్లో గడించుకొన్న
ఓటు, నోటొ ? జనాళికి రాఁటుఁగాక !

17

ధనముచేఁ గొన్న యోట్లతోఁ గొనినపదవి
నధివసించిన పెద్దల యాధిపత్య
మునకు లోనగుసంస్థల మూలముగను
ప్రజల కురిత్రాడుగాక, లాభంబుఁ గలదె?

18

రైతులకుఁ బన్ను తగ్గింతు, గ్రామమునకు
బాటవేయింతుఁ, ద్రవ్వింతు బావి, జనుల
కడవిపుల్లరి దీయింతు నంచు జన్ని
రోగులటు గొంద ఱోట్లకై వాగుచుంద్రు.

19

ప్రజలు వైద్యు నుపాధ్యాయుఁ బడవవాని
మంత్రసానిని దూతికఁ బనులు గలుగు
పట్లఁ బర్వెత్తి కాళ్ళైనఁ బట్టుకొంద్రు;
కార్యములు దీఱ వారి మొగంబుఁ గనరు.

20

పుట్టురోసము గలకోడిపుంజుగములఁ
బెంచి పురికొల్పి రణముఁ గల్పించి వాని
జయము, తమజయముగ, నపజయము తమదు
నపజయంబుగ నెంచు టనార్యమతము!

## 21

ఆయు వొకయింత పదియంత లగువ్యయంబు
గలుగు సంసార మెట్టులు గట్టుకెక్కుఁ
గాన నున్నంతలోననే గౌరవముగఁ
గడుపవలె నాలుమగ లప్పువడక సరిగ.

## 22

వాహనము రాదు, కనరారు భటులు, దండ
మూనఁ, దురుపాశమునఁబట్టు మోజ లేదు;
శాసనము సేయలే, డార్వఁ జనునె యుత్త
మన్నఁ గనుచోటఁదా నధర్మమ్ముఁ డడలి.

## 23

పరమలోకోపకారు లెందఱు మహాత్ము
లనఁగ సత్యప్రతిష్ఠ కత్యంతదీక్షఁ
బ్రాణముల ధారవోయ; రామానితకృతి
యశముఁ గనుకీర్తి గాంధికె జగతిఁ దక్కె!

## 24

పేదరైతులు కొట్లాడి పెద్దలకడ
పిన్నవింపఁగ నవ్వారు వీరిసొత్తు
తగవుఁ దీర్చునెపమున లుక్తం బొనర్చు;
“కంచెయే చేను మేసినఁ” గలదె ? ఫలము!

25

సంతతానంద రాజ్య మర్థింతువేని
పావనంబగు జీవిత ◦ భాగమెల్ల
దాతవై మనుము కాని, గ్రహీతవగుచు
నొక్క క్షణకాలమైనను ◦ నుండవలదు.

26

భౌతికయుగంబు యంత్ర ప్రబంధమందు
నన్యృతహింసార్థికార్జనాభ్యాయములగు;
నాస్తికమత ప్రశంస గద్యమ్ము; దీని
సంస్కరింపఁగ నే కవీశ్వరుఁడు గలఁడో?

27

తలపునకుఁ దోఁచుభావముల్ ◦ దొలఁగనీక
వ్రాసితిని బ్రజకుపయోగ ◦ పడునటంచు
నొక్కఁడేని గ్రహించి మే ◦ లొందెనేని
శ్రమమునకు ఫల మంచెద ◦ సంతసింతు.

(సశేషము)

(ఇది శ్రీనారునాగనార్య విరచితము)

ఓమ్. శాంతిః శాంతిః శాంతిః.

---

చెన్నపురి : వావిళ్ల రామస్వామిశాస్త్రులుఅండ్ సన్స్ వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1939.

# సవరణములు.

| పేజీ | పద్యము | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| పీఠికపుట 7 | [illegible]-వ పంక్తి | యీ | నీ |
| 11 | 11 | జరిగి | జరగి |
| 19 | 42 | మొఱఁగ | మొఱఁగు |
| 21 | 49 | సత్ర | సత్ర |
| 23 | 55 | దగిన వి | దగినవి. |
| ,, | ,, | యవి | యివి |
| ,, | 59 | మై | నై |
| 23 | 5 | పదము | పదవి. |
| 33 | 4 | గన | గనఁ |
| 44 | 34 | లేని | పేని. |
| 45 | 40 | నందు | యందు |
| 46 | 42 | మలపుఁ | మలసఁ |
| 51 | 7 | సంకుచితంబు. | సంకుచితంపు |
| 52 | 10 | బౌనుపడు | బనుపడు |
| 59 | 40 | ప్రునరుద్ధరణముకై— | పునరుద్ధరణకయి. |
| 61 | 41 | పెల్లదరఁ— | పెల్లడరఁ— |
| 63 | 6 | వెచ్చఁబెట్టి— | వెచ్చపెట్టి. |
| 70 | 7 | ద్రావి నక్షుధా. | ద్రావినక్షుధా |
| ,, | 8 | జనులకాత్మ | జనము లాత్మ |
| 73 | 19 | బట్ట. | బట్టు |